భావనయా చ

అవిద్యాయా



బద్ధః

వివిక్త ఆత్మా!



లోకోద్ధారకులు :

## మహర్షి శ్రీ సద్గురు మలయాళస్వామివర్యులు

క॥ గురుదేవ భవత్కారుణన్ - విరచించితి గీత సులభవేద్యత ప్రశ్నో
త్తరముగ వచనము నానా - నరులు తరించగ గైకొను నా వందనముల్.



రచయిత :

శ్రీ సహజానందస్వామివారు



# శ్రీ ప్రశ్నోత్తరీ ప్రవచనగీత

## పోషకవర్గము

ఓ భగవంతా! న్యాయమూర్తీ! సచ్చిదానందఘనప్రభో! దేవదేవా! పరోపకారపరాయణధురీణులగు శ్రీ ప్రశ్నోత్తరీప్రవచనగీత నచ్చొత్తించ ధనసహాయ మొనర్చిన వీరికి, వీరి కుటుంబములకు తమ తమ యభీష్టముల సిద్ధింపజేసి జ్ఞానవైరాగ్యముల పురుషార్థమును ప్రసాదింపుము.

## ఉద్ధారకులు రు. 500

### కడప జిల్లా

1. స్వర్గీయ శ్రీమతి నంజమ్మగారి జ్ఞాపకార్థము భర్త శ్రీ ఎ. కృష్ణప్ప గారు, అల్లుడు శ్రీ కృష్ణమూర్తిగారు, స్వగ్రామం పెనుకొండ, ప్రకృతనివాసం కడప, రాతినారగనులు బెట్టించి విదేశవ్యాపారము 1929 నుండి సాగించువారు, గొప్ప యుదారులు, కడపటవున్, కడపతాలూకా.

### గుంటూరు జిల్లా

2. బి. సి. వి. నర్సరాజుగారు, సెంట్రల్ యక్సైన్ డి॥ సూపరింటెండెంటు గారు, వీరి ధర్మపత్ని శ్రీమతి రంగనాయకమ్మగారు, చిలకలూరుపేట, చిలకలూరుపేట తాలూకా.

## మహారాజపోషకులు రు. 116

### తూర్పుగోదావరి జిల్లా

1. స్వర్గీయ శ్రీ రుద్రరాజు వేంకట్రాజుగారి జ్ఞాపకార్థము కుమారుడు శ్రీ రామలింగరాజుగారు, వీరి ధర్మపత్ని శ్రీమతి అప్పల నరసయ్యమ్మగారు, పద్మరాజపురం, రాజోలు తాలూకా.

2. శ్రీ అల్లూరు రామరాజుగారు, సఖినేటిపల్లె, రాజోలు తాలూకా.
3. స్వర్గీయ శ్రీమతి అల్లూరు బంగారయ్యమ్మగారి జ్ఞాపకార్థము కుమారుడు శ్రీ మూర్తిరాజుగారు, సఖినేటిపల్లె, రాజోలు తాలూకా.
4. శ్రీ రుద్రరాజు వేంకటనృసింహరాజుగారు, వీరి ధర్మపత్ని శ్రీమతి వేంకటనరసమ్మగారు, సఖినేటిపల్లె, రాజోలు తాలూకా.
5. శ్రీ జాస్తి శంకరయ్యగారు, మోరిగ్రామం, రాజోలు తాలూకా.

## పశ్చిమ గోదావరిజిల్లా

1. శ్రీ కందుల పెద్దవేంకయ్యగారు, వీరి ధర్మపత్ని శ్రీమతి మంగమ్మగారు, పాలకొల్లు, నరసాపురం తాలూకా.
2. స్వర్గీయ తల్లి జ్ఞాపకార్థము శ్రీమతి సింహాద్రి సత్తిరాజమ్మగారు, పాలకొల్లు, నరసాపురం తాలూకా.
3. శ్రీ కారుమూరు సుబ్బారావుగారి జ్ఞాపకార్థము కుమారులు వేంకట్రావ్ అండ్ బ్రదర్స్‌వారు, పాలకొల్లు, నరసాపురం తాలూకా.
4. శ్రీ కారుమూరు నరసయ్యగారి ధర్మపత్ని శ్రీమతి రత్నమ్మగారు, పాలకొల్లు, నరసాపురం.
5. స్వర్గీయ తలిదండ్రుల జ్ఞాపకార్థము శ్రీ వేంకటగడ్డి సుబ్బారావుగారు, వీరి ధర్మపత్ని శ్రీమతి సుబ్బమ్మగారు, పాలకొల్లు, నరసాపురం తా॥
6. శ్రీ యిమ్మిడి సత్యనారాయణగారు, ,,
7. శ్రీ రుద్రరాజు నృసింహరాజుగారి కుమారులు శ్రీ వేంకట్రాజుగారు, పోడూరుగ్రామం, నరసాపురం తాలూకా.
8. స్వర్గీయ శ్రీ వెలగల రామిరెడ్డిగారి జ్ఞాపకార్థము కుమారుడు శ్రీ వీరారెడ్డిగారు, నత్తారామేశ్వరం, తణుకు తాలూకా.
9. శ్రీమతి సాధు సత్యవతమ్మగారు, శ్రీ రాధాకృష్ణాశ్రమము, వేల్పూరు, తణుకు తాలూకా.

## క డ ప జి ల్లా

స్వర్గీయ శ్రీపాపిరెడ్డిగారి అంకిరెడ్డిగారు, వీరి ధర్మపత్ని శ్రీమతి సుబ్బమ్మ గారు, కుమారుడు శ్రీ పెద్దవెంకటరెడ్డిగార్ల జ్ఞాపకార్థము కోడలు శ్రీమతి సుబ్బమ్మగారు, లావనూరు, జమ్మలమడుగు తాలూకా.

శ్రీమతి మాత్ర వేంకటమ్మగారు, ,, ,,

స్వర్గీయ శ్రీ పాపిరెడ్డిగారు సుబ్బారెడ్డి దత్తుకుమారుడు శ్రీ చిన్న వెంకటరెడ్డిగారు, లావనూరు, జమ్మలమడుగు తాలూకా.

స్వర్గీయ శ్రీ అరిగెల రంగయ్య జ్ఞాపకార్థము కుమారుడు శ్రీ రంగయ్య గారు, హ్యాండులూమ్ క్లాత్ మర్చంటు, జమ్మలమడుగుటవున్, జమ్మలమడుగు తాలూకా.

స్వర్గీయ శ్రీమతి బొగ్గుల నారాయణమ్మగారి జ్ఞాపకార్థము భర్త శ్రీ చన్నారెడ్డిగారి కుమారుడు శ్రీ దస్తగిరిరెడ్డిగారు, రైల్వే ఎఱ్ఱ గుంట్లగ్రామం, కమలాపురం తాలూకా.

# రాజపోషకులు రు. 58

## ప శ్చి మ గో దా వ రి జి ల్లా

స్వర్గీయ ఆబోతుల రామన్నగారి జ్ఞాపకార్థము భార్య శ్రీమతి మాముళ్లమ్మగారు, పాలకొల్లు, నరసాపురం తాలూకా.

శ్రీ చేకూరు వేంకట్రాజుగారు, పోడూరు, ,,

శ్రీ రుద్రరాజు నృసింహరాజుగారి కుమారులు శ్రీ లక్ష్మణరాజుగారు, పోడూరు, నరసాపురం తాలూకా.

శ్రీ రుద్రరాజు కార్తికేయవర్మ అనే లక్ష్మీనృసింహప్రసాద్‌గారు, పోడూరు, నరసాపురం తాలూకా.

శ్రీ రుద్రరాజు బంగార్రాజుగారి కుమారులు స్వర్గీయ సూరపరాజు గారి జ్ఞాపకార్థము వారి కుమారులు, పోడూరు, నరసాపురం తా॥

6. శ్రీ రుద్రరాజు బంగార్రాజుగారి కుమారులు శ్రీ రామరాజుగారు, పోడూరుగ్రామం, నరసాపురం తాలూకా.

7. శ్రీ రుద్రరాజు బంగార్రాజుగారి కుమారులు శ్రీ వేంకట్రాజుగారు, పోడూరుగ్రామం, నరసాపురం తాలూకా.

8. శ్రీ రుద్రరాజు సుబ్బరాజుగారి ధర్మపత్ని శ్రీమతి బంగారయ్యమ్మ గారు, పోడూరుగ్రామం, నరసాపురం తాలూకా.

## క డ ప జి ల్లా

1. శ్రీ ముడియం సీతారామయ్యశ్రేష్ఠిగారు, ప్రొద్దుటూరుటవున్, ప్రొద్దుటూరు తాలూకా.

2. స్వర్గీయ శ్రీ తిరువల్ల రంగయ్య జ్ఞాపకార్థము కుమారుడు శ్రీ పెద్దయ్య గారు, డ్రయిపీస్ మర్చంటు, జమ్మలమడుగుటవున్, జ॥ తా॥

3. స్వర్గీయ శ్రీ నర్రావుల చెంగలరాయశెట్టి కుమారుడు శ్రీ పుల్లయ్య గారు, లావనూరుగ్రామం, జమ్మలమడుగు తాలూకా.

4. స్వర్గీయ శ్రీ చింతకుంట చిన్నమునెయ్యగారు, వీరి ధర్మపత్ని శ్రీమతి లక్ష్మమ్మగారి జ్ఞాపకార్థము కుమారుడు శ్రీ సుబ్బానాయుడుగారు, పోట్లదుర్తి, కమలాపురం తాలూకా.

5. స్వర్గీయ శ్రీ చింతకుంట నాగయ్య, వీరి ధర్మపత్ని శ్రీమతి లక్ష్మమ్మ గార్ల జ్ఞాపకార్థము కుమారుడు శ్రీ ఈశ్వరనాయుడుగారు, పోట్లదుర్తి, కమలాపురం తాలూకా.

6. స్వర్గీయ శ్రీ మూల గంగిరెడ్డి జ్ఞాపకార్థము కుమారుడు శ్రీ ఓబుళరెడ్డి గారు, తిప్పలూరు, కమలాపురం తాలూకా.

7. స్వర్గీయ శ్రీ అంబటి చిన్న చెంచయ్య జ్ఞాపకార్థము భార్య శ్రీమతి ఓబుళమ్మ కుమారిత శ్రీమతి అక్కమ్మగారు, తిప్పలూరు, కమలాపురం.

8. స్వర్గీయ శ్రీ యిల్లూరు దస్తగిరిరెడ్డి జ్ఞాపకార్థము భార్య శ్రీమతి చిన్నమ్మ కుమారిత శ్రీమతి పుల్లమ్మగారు, తిప్పలూరు, కమలాపురం.

9. స్వర్గీయ శ్రీ వడ్లమాని వేంకటరెడ్డి వీరి ధర్మపత్ని శ్రీమతి అచ్చమ్మ గార్ల జ్ఞాపకార్థము కుమార్లు శ్రీ నారాయణరెడ్డి గంగిరెడ్డిగారు, తిప్పలూరు, కమలాపురం.

10. స్వర్గీయ శ్రీ సానేపల్లె చన్నారెడ్డి వీరి ధర్మపత్ని శ్రీమతి పున్నమమ్మ గారి జ్ఞాపకార్థము కుమారుడు శ్రీ పిచ్చిరెడ్డిగారు, తిప్పలూరు, కమలాపురం తాలూకా.

11. స్వర్గీయ శ్రీ సానేపల్లె నారాయణరెడ్డి భార్య శ్రీమతి చన్నమ్మగారి జ్ఞాపకార్థము కుమారుడు శ్రీ సూరారెడ్డిగారు, తిప్పలూరు, కమలాపురంతాలూకా.

12. స్వర్గీయ అక్కెము కొండప్ప కుమారిత శ్రీమతి వేంకటమ్మ జ్ఞాప కార్థము శ్రీమతి లక్ష్మమ్మగారు, తిప్పలూరు, కమలాపురం.

13. స్వర్గీయ శ్రీ తిప్పన వేంకటసుబ్బరెడ్డి జ్ఞాపకార్థము భార్య శ్రీమతి ఓబు ళమ్మగారు, పందిళ్లపల్లె, కమలాపురం తాలూకా.

## కర్నూలు జిల్లా

14. స్వర్గీయ ఖేతి శ్రీ సుబ్బారెడ్డి వీరి ధర్మపత్ని శ్రీమతి అచ్చమ్మగార్ల జ్ఞాప కార్థము కుమారుడు శ్రీ శేషారెడ్డిగారు, కాకరవాడగ్రామం, కోయిలకుంట్ల తాలూకా.



ఓమ్

# గీత



"నాంతోఽస్తి మమ దివ్యానాం విభూతీనాం పరంతప"

ఓ అర్జునా ! నాయొక్క దివ్యములైన విభూతులకు అంతములేదు దైవసంబంధమైన భగవచ్ఛక్తులకు అంతములేదని శ్రీకృష్ణభగవానుడుపదేశించడమైనది. భగవంతుడేలాగున అనంతుడో, భగవచ్ఛక్తియు ననంతమే యని మనము గ్రహించుకొనవలయును. ఆలాగున "అనంతా వై వేదాః" వేదములు కూడా అనంతములు. అప్పుడు వేదార్థములు కూడ అనంతములని యంగీకరించవలయును. భగవద్గీత జ్ఞానరత్నముల ఖని. గని త్రవ్వగా, త్రవ్వగా రత్నములు బయటపడునట్లు గీతను ధ్యానించగా, చింతించగా జ్ఞానరత్నములు బయలుపడుచుండును. అయితే దీనికి భగవదనుగ్రహము గలిగియుండవలయునని మరువకూడదు. ఆకాశము వర్షాకాలమున మేఘావృతమైయుండగా, ప్రకాశమైన చంద్రుడుకాని, సూర్యుడుకాని కనిపించవు. శరదృతువు వచ్చినపుడు మేఘము తెల్లబడుటవలన సూర్యచంద్రులు సుమారుగ గోచరింతురు. వసంత, గ్రీష్మఋతువు లావిర్భవించినపు డాకాశ మెంత నిర్మలముగానుండునో. అపుడు నక్షత్రములు, అతి సూక్ష్మనక్షత్రములుగూడా యెట్లు దృష్టికి గోచరించునో నాలాగున హృదయము నిర్మలమై, వినిర్మలమై రాగా రాగా సూక్ష్మమైన రహస్యార్థ క్తిన్ని, నిగూఢమైన గీతార్థమున్ను మనకు గోచరించును. ఇక నీ విషయమై విస్తరింపఁబూనలేదు. ప్రస్తుతవిషయములోనికి ప్రవేశించెద. భగవద్గీతా మాహాత్మ్యము మామూలుగ వరాహపురాణమందు భూదేవికి శ్రీ విష్ణుమూర్తి యుపదేశించినది మాత్రమే నన్నిగీతలలోను 23 శ్లోకములుగలవు. నైమిశారణ్యమందు శౌనకాది మహర్షులకు సూతమహర్షి గీతామాహాత్మ్యము నుద్దేశించి 52 శ్లోకములు చెప్పెను. ఇది మహాభగవద్గీతయందు గలదు.

ఋషిరువాచ:—

శ్లో॥ గీతాయాశ్చైవ మాహాత్మ్యం యథావత్సూత మే వద ।
పురాణమునినా ప్రోక్తం వ్యాసేన శ్రుతి-చోదితమ్ ॥

తా॥ అనేకవిధములైన కథలను వినుచు శౌనకఋషి, సూతమహర్షి నిట్లు ప్రశ్నించెను. ఓ సూతమహర్షీ ! వేదోక్తమగు శ్రీ వ్యాసమహర్షిచే చెప్పఁబడిన ప్రకారము శ్రీమద్భగవద్గీతా మాహాత్మ్యమును నాకుఁ జెప్పుము.

సూత ఉవాచ:—

శ్లో॥ పృష్టం వై భవతా యత్తన్మహద్గోప్యం పురాతనం।
న కేన శక్యతే వక్తుం గీతామాహాత్మ్యముత్తమమ్॥

తా॥ శౌనకమహర్షి యొక్క ప్రశ్నను విని సూతుఁ డిట్లు వచించెను. ఓ శౌనక మహర్షీ! నీవు యే గీతా మాహాత్మ్యమును గురించి యడిగితివో, ఆ మహాత్మ్యము అతి గోప్యమై ప్రాచీనమైనదిగా నుంటున్నది. అందువలన గీతయొక్క అత్యుత్తమమైన మాహాత్మ్యమును సంపూర్ణముగాఁ జెప్పుటకు ఎవడును సమర్థుడు గాఁడు.

వి॥ సూతుడు జెప్పిన నీ క్రింది శ్లోకమును గ్రహించిన గీతార్థ మెటువంటిదో అందరున్ను గ్రహింపఁగలరు.

శ్లో॥ కృష్ణో జానాతి వై సమ్యక్ క్వచిత్కౌన్తేయ ఏవ చ।
వ్యాసో వా వ్యాసపుత్రో వా యాజ్ఞవల్క్యోఽథ మైథిలః॥

తా॥ ఈ గీతామాహాత్మ్యమును సంపూర్ణముగ శ్రీకృష్ణభగవానుఁ డొక్కఁడే యెరుగుచున్నాడు. మఱియు అర్జునుడు కొంచెము తెలుసుకొనుచున్నాడు. అట్లే కొంచెము, కొంచెము శ్రీ వ్యాసమహర్షి, శుకమహర్షి, యాజ్ఞవల్క్యమహర్షి, శ్రీ జనకచక్రవర్తి తెలియుచున్నారు.

వి॥ ఇక దీనిని గురించిఁ జెప్పఁ గలంతలేదు.

శ్లో॥ గీతాజ్ఞానం శ్రుతం నైవ సదైవాభ్యాసయోగతః।
మోక్షమిచ్ఛతి మూఢాత్మా యాతి బాలకహాస్యతామ్॥

తా॥ ఎవడైతే గీతాసంబంధమైన జ్ఞానము నెల్లప్పు డభ్యాసయోగముచే వినుట లేదో, ఆ మూర్ఖుడు మోక్షమును కోరినట్టైనచో, బాలకునివలె పరిహాసాస్పదుడగుచున్నాడు.

వి॥ బాలకుడు నేను మోక్షమునకుఁ బోవుచున్నానని చెప్పినచో యది యెంత హాస్యాస్పదమైనదో, గీతాశాస్త్రమును జదువకనే మోక్షము గలుగునని చెప్పుటయు నటువంటిదే. ఏలన బ్రహ్మనిష్ఠులై వేదార్థ మెరిగినవారిచే పొందదగినది మోక్షము.

శ్లో॥ మోక్షస్థానం పరం పార్థ సగుణం వాఽథ నిర్గుణం।
సోపానాష్టాదశైరేవం పరం బ్రహ్మాధిగచ్ఛతి॥

తా॥ ఓ అర్జునా! సగుణమైనట్టి లేక నిర్గుణమైనట్టి మోక్షస్థానమునకు 18 అధ్యాయములను సోపానములుగా జేసికొని మనుష్యుడు పరబ్రహ్మమును మోక్షమును పొందు చున్నాడు.

వి॥ శ్రీకృష్ణభగవానుడు సగుణ, నిర్గుణోపాసనలు రెండున్ను మోక్షహేతువులని తెలుపడమైనది.

శ్లో॥ దేవకీనందనః కృష్ణో గీతాపాఠేన తుష్యతి।
యథా న వేదైర్దానైశ్చ యజ్ఞతీర్థవ్రతాదిభిః॥

తా॥ ఎటుల దేవకీనందనుడైన శ్రీకృష్ణభగవానుడు గీతాపఠనముచే సంతుష్టుడగుచున్నాడో, అటుల వేదాధ్యయనము చేగాని, దానముచేగాని, తీర్థయాత్రచేగాని, వ్రతముచేగాని సంతుష్టుడగుటలేదు.

వి॥ గీతాప్రభావ మెటువంటిదో, దీనివలన తెలిసికొనవచ్చును.

శ్లో॥ పితౄనుద్దిశ్య యః శ్రాద్ధే గీతాపాఠం కరోతి వై।
సంతుష్టాః పితరస్తస్య నిరయాద్యాంతి సద్గతిమ్॥

తా॥ ఎవడు శ్రాద్ధమునందు పితృదేవతలనుగూర్చి గీతాపఠనము జేయునో, అతనియొక్క పితృదేవతలు సంతుష్టులగుచున్నారు. మరియు నరకవిముక్తులై పుణ్యలోకమును బొందుచున్నారు.

వి॥ శ్రాద్ధకాలములో, గురువుయొక్క యారాధనకాలములో గీతాపారాయణము జేసిన గలిగెడి ఫలము నిచట నిరూపించబడినది.

శ్లో॥ గీతాపాఠేన సంతుష్టాః పితరః శ్రాద్ధతర్పితాః।
పితృలోకం ప్రయాంత్యేవ పుత్రాశీర్వాదతత్పరాః॥

తా॥ ఇవ్విధముగా పితృదేవతలు శ్రాద్ధముచే మరియు గీతాపఠనముచే ప్రసన్నులై పుత్రుని కాశీర్వాదములిచ్చుచు, పుణ్యలోకమునకు పోవుచున్నారు.

వి॥ తల్లిదండ్రులైన పుత్రులకున్ను, గురువైన శిష్యులకున్ను, దేవతల నుద్దేశించినవారైన భక్తులకున్ను యాశీర్వాదమిచ్చి వారి వారి కేర్పడిన లోకముల కెళ్ళుచున్నారు.

శ్లో॥ శతపుస్తకదానం చ గీతాయాః ప్రకరోతి యః।
పితృలోకం ప్రయాంత్యేవ పుత్రాశీర్వాదతత్పరాః॥

తా॥ ఎవడు నూరు గీతాపుస్తకములు దానముఁ జేయునో, వాని పితృదేవతలు వీని నాశీర్వదించి, యీ గీతాదానపుణ్యఫలముచే పుణ్యలోకమును బొందుచున్నారు.

వి॥ గీతాదానముయొక్క పుణ్య మీ శ్లోకమున నిరూపించబడినది. ఇది పూర్ణదానముయొక్క ప్రయోజనము. ఇక వారి వారి శక్తి ననుసరించి చేసినదానికి తగిన ఫలమును బొందగలరు.

ఓం శ్రీకృష్ణపరబ్రహ్మణే నమః

# గీతాశాస్త్రము

ప్రపంచమునందు భగవత్తత్త్వప్రతిపాదకములగు శాస్త్రములు, నిగమములు, తదంతములగు వేదాంతములు బ్రహ్మవిద్యాస్వరూపములై, సమూలాజ్ఞానవిధ్వంసకములై ప్రవర్తిల్లుచున్నవి. ఆ సకలశాస్త్రములయొక్క పరమసారమై సర్వజనులకును సులభోపాయప్రదీప్తిజనకమై శ్రీభగవద్గీతాశాస్త్రము సర్వోత్కృష్టముగనున్నది. దీనియొక్క మాహాత్మ్యమును

శ్లో॥ కృష్ణో జానాతి వై సమ్యక్ కించిత్ కౌంతేయ ఏవ చ।
వ్యాసో వా వ్యాసపుత్రో వా యాజ్ఞవల్క్యశ్చ మైథిలః॥

అను ప్రమాణశ్లోకము విశదముగా తెలుపుచున్నది. భగవంతుని హృదయతత్త్వమగు నీగీతాశాస్త్రము ప్రస్తుతకాలముననే గాక సృష్ట్యాదినుండియు నేటివరకును ప్రవర్తిల్లుచునే యున్నది. ఇందులకు ప్రమాణములు—

శ్లో॥ మహర్షయః సప్తపూర్వే చత్వారో మనవస్తథా।
మద్భావా మానసా జాతా యేషాం లోక ఇమాః ప్రజాః॥

శ్లో॥ ఇమం వివస్వతే యోగం ప్రోక్తవానహమవ్యయమ్।
వివస్వాన్మనవే ప్రాహ మనురిక్ష్వాకవేఽబ్రవీత్॥

ఈ గీతాశాస్త్రమును మహర్షులు, పండితులు మొదలగు మహాత్ములందరు వ్యాఖ్యానించుచున్నారు, ఇతరులకు బోధించుచున్నారు. ఈ ప్రకారము గీతాశాస్త్రతత్త్వమును సేవించి ఆత్మజ్ఞానమును పొంది విముక్తులగుచున్నారు. అయినను భగవద్గీతాశాస్త్రమునకు వ్యాఖ్యానములు ప్రచారములు భగవత్తత్త్వమువలె ననంతములై వెలయుచున్నవి. వేదాంతతత్త్వమంతయు జీవబ్రహ్మైక్యపరమై గురుశిష్య సంవాదరూపమునను, పితృపుత్ర న్యాయమును ననుసరించియు ప్రవర్తిల్లుచున్నది. ఇందుచే సామాన్యముగ వేదాంతశాస్త్రములు ప్రశ్నోత్తరరూపములై సామాన్యముగ నుంటున్నవను విషయము విస్పష్టము. ఈ విధముగ బృహదారణ్యక ఛాందోగ్యోపనిషదాది గ్రంథములు నున్నవి.

ఇంత యేల? ఒక విషయమై ప్రశ్నయు తదుత్తరము రెండును గలుగునప్పుడే ఆ విషయము సంశయరహితమై భాసిల్లుచున్నది. అందుచేతనే యీ గీతాశాస్త్రము

శ్రీకృష్ణార్జునసంవాదరూపమై నెగడుచున్నది. ముఖ్యముగ నీగీతాశాస్త్రము జీవతత్త్వమును పరమాత్మస్వరూపమును దెలుపుచు తదైక్యమునుగూడా నిస్సంశయముగా ప్రతిపాదించుచున్నది. ఈ గీతాశాస్త్రమును ప్రజ్ఞావంతులు ప్రౌఢశైలితో వ్యాఖ్యానించి ప్రబోధించుచున్నారు. మఱికొందరు మహాత్ములు సదయహృదయులై సామాన్యజనులు గూడ నీ భవసాగరమును తరించుటకై యీ గీతాతత్త్వమును సులభశైలితో వ్యాఖ్యానించి గద్యరూపమునను, పద్యరూపమునను, గేయరూపమునను వారి వారికి తగురూపమున ప్రచారము చేయుచు సర్వమును భగవన్మయముగ జేయుచున్నారు.

ప్రస్తుతవిషయమునకే వత్తముగా శ్రీశ్రీశ్రీ అసంగానందస్వాములవారు శ్రీ భగవద్గీతాతత్త్వమును ఎల్లజనులకును సులభముగా ప్రబోధించెడు స్వభావముతో వెలయుచున్నారు. వీరికి భగవద్గీతాశాస్త్రము మిగుల ప్రియతమమైనది. దాని నాధారముగా జేసికొనియే స్వాత్మానుభవమును జెందుచుండిరి. వీరు సహజకవితాసమలంకృతులు. సామాన్యముగా వృత్తాంతములు లేనిదే ఏ విషయమును ప్రబోధించువారు కారు. ఈ విషయము వీరి ప్రబోధములను శ్రవణము చేసినవారికి విస్పష్టము. గీతాతత్త్వము ప్రశ్నోత్తరరూపమున నుండినచో సకలజనులకు సుబోధితమగునను తలంపుతో నీ గ్రంథమును వ్రాసిరి. దీని నేను నాలుమాఱులు సాంతముగ వింటిని, చూచితిని. అనేకగ్రంథముల రచించినవారగుటచే వీరియొక్క ప్రబోధశైలీవిషయమై నే వచింపదగినది లేదు. రచనాపద్ధతి నిబిడమై సముజ్జ్వలమై వెలయుచున్నది. నిరర్థకపదములు లేవు. వ్యాఖ్యానము సుమధురమై సావధానమతులకు సులభగోచరమై నెగడుచున్నది. పాఠకులు దీనిని పఠించి యొంతేని విజ్ఞానమార్జింపగలరని విశ్వసించుచున్నాను. పఠించువారు సకలవిషయములను దెలియగలరు, ఆనందింపగలరు, తరింపగలరు. సంశయరహితులై పరతత్త్వజ్ఞానసంపూర్ణులై ధన్యాత్ములు కాగలరు.

ఓం తత్ సత్

సాహిత్యశిరోమణి, సాహిత్యసుధాకర,
**శివచరణము,**
శ్రీ వ్యాసాశ్రమము, ఏర్పేడు.

ఓం

# శ్రీప్రశ్నోత్తరీ ప్రవచనగీతనుగురించి పూజ్యమహనీయుల

# అభిప్రాయములు

*Dear Swamiji,*

Thank you for your letter and the book "Prasnottara Pravachana Gita" which I glanced through. I hope it will be a useful handbook to students of the Gita.

With best wishes,

*Yours sincerely,*

***S. Radhakrishnan,***

**Vice-President, India, New Delhi.**

---

*Jatavallabhula Purushottam*, M.A.,
Lecturer in Sanskrit S. R. R. & C. V. R. Govt. College.)

Satyanarayanapuram,
VIJAYAWADA - 2.
2—5—60

శ్రీ సహజానందస్వామివారి ప్రశ్నోత్తరీయ ప్రవచనగీతను చూచినాను. ఆధ్యాత్మికదృష్టిని పెంపొందింపచేయుశక్తియేగాక జిజ్ఞాసువుల ఆధ్యాత్మిక సందేహములనుతీర్చు పాటవము అనేక స్థలములలో నాకు కన్పట్టినది.

(Sd.) జటావల్లభుల పురుషోత్తము.

---

ఓం

"కృష్ణంవందే జగద్గురుమ్"

శ్రీశంకరానందస్వామివారు, మకాం-ఆళ్లగడ్డ,

శ్రీశంకరానందాశ్రమం. శార్వరి శ్రీశంకరజయంతి

పూజ్యపాదస్వామివారూ!

తమచే రచింపబడి, ప్రేమతో తమచేపంపబడిన "పశ్నోత్తరీ ప్రవచనగీత" యను పుస్తకమును సాదరముగ స్వీకరించి అందందు పఠించితిని.

జ్ఞానశాస్త్రమగు భగవద్గీతకు విపులమగు వివరణమునువ్రాసి ఆంధ్రలోకమునకు మహోపకారమొనర్చితిరి. జ్ఞానదానమునకంటె మహోపకారమేమున్నది? సరియగు జ్ఞానమే సుఖశాంతులకు మూలము; శక్తికిభండారము; సామర్థ్యమునకు ఠికానా; యశస్సుకు బీజము; ఉన్నతికి తల్లి; గొప్పతనమునకు పునాది; ధైర్యమునకు కారణము; ప్రగతికి ప్రాణము. ఉత్తమజ్ఞానముతో కానిపనిలేదు.

అజ్ఞానము దుఃఖములకుపుట్టిల్లు; అశాంతికి మూలకందము; పిరికితనమునకు తల్లి. హీనతకు రూపము; నిస్పృహకు గర్భగుడి. అజ్ఞానము మనుష్యజీవితమునకు అభిశాపము.

సర్వానర్థకారియగు అట్టి అజ్ఞానమును నివారించి పరమపురుషార్థమగు తత్త్వజ్ఞానమును మానవలోకమునకు ప్రసాదించుటకే గీతయొక్క అవతారము జరిగినది.

తాము రచించిన భగవద్గీత వివరణము లోకమున జ్ఞానప్రకాశమును ప్రసరించుచు సూర్యునివలె ప్రకాశించుగాక!

శ్రీ సహజానందస్వామివారు వ్రాసిన "శ్రీప్రశ్నోత్తరీప్రవచనగీత" ఆదరముతో అందుకొని ఆసక్తితో అందందు చదివితిని. ప్రశ్నోత్తరముల రూపముతో యింతటి మహాగ్రంథమును యెట్లు రచించిరా యను ఆశ్చర్యము మొమ్మొదటనే కలిగినది. పదునెనిమిది అధ్యాయములకు ప్రత్యేక ప్రత్యేకముగ యింత విపులమైన వివరణము యింతవరకు యెక్కడను చూచియుండలేదు. ఈ మహాకృషికి భూరి భూరి ధన్యవాదములు.

భగవద్గీతను చెప్పువారందరు శ్రీకృష్ణస్వరూపులనియు, వినువారందరు అర్జునస్వరూపులనియు, వ్రాయువారందరు వ్యాసస్వరూపులనియు నా అభిప్రాయము. శ్రీవ్యాసులవారి అంశము యీ స్వాములవారి యందున్నదని యీ గ్రంథరచనయే నిరూపించుచున్నది. అస్తు.

అనేకములగు విషయములు, కథలు, దృష్టాంతములతో కూడి గ్రంథము జిజ్ఞాసువులకు ప్రచారకులకు పండితులకు పామరులకు ఆదరింప దగినదియై ఉన్నది.

గీతాభక్తులకు కల్పతరువువంటి యీ గ్రంథ మాంధ్రదేశమున విపులవ్యాప్తిని గడించుగాక ! ఓమ్

మకాం — అళ్లగడ్డ,
శార్వరి శ్రీశంకరజయంతి.

[signature]
సంపాదకుడు — "గీతావాణి".

---

శ్రీ స్వామి సహజానంద పరమహంసగారు వ్రాసిన "ప్రశ్నోత్తరప్రవచనగీత"ను నేనామూలాగ్రముగ జూచితిని. శ్రీస్వామి వారిందనేక యుదాహరణములతో వివిధశాస్త్రవిషయములం జేర్చుచు శ్రీమద్భగవద్గీతాధ్యాయముల తాత్పర్యమును అన్యూనాధికముగ ప్రతిపాదించి యుండిరి. ప్రశ్నోత్తరరూపముగా నున్నందున చదువువారలకిందు ప్రతిపాదిత ప్రాకరణిక విషయములన్నియు సులభావగమములు. దీనిని జక్కగజదివి యర్థము జేసుకొన్నవారికి గీతార్థమేగాకుండ వేదాంత ప్రక్రియయు శ్రుతిస్మృతీతిహాసపురాణముల సమాచారమును దెలియబడగలదు. మరియు నిందలి ప్రతిపాదనశైలియు ప్రశ్నోత్తరముల పద్ధతియు పూర్వతన గీతావ్యాఖ్యానములకంటె విలక్షణతను సూచించుచున్నవి. ఇట్టి కారణములచే నియ్యది బహువిధప్రాక్తన గీతావ్యాఖ్యానములచే నగణితార్థము.

జాతిమతభేదములు స్వార్థపరుల కల్పనలేగాని శాస్త్రీయములు గావని నిరూపించుచు ఆ భేదములవలన గలిగిన భారతదేశావనతినిగూర్చి వారిందు హార్దికక్లేశమునుగూడ ప్రకటించియున్నారు.

శాస్త్రగోచరమగు బ్రాహ్మణత్వ క్షత్రియత్వాదుల విషయములో ప్రాచీన శాస్త్రకారుల యభిప్రాయములు ప్రస్తుత విద్వాంసులమతములును వీని ననుకరించుచున్నవి.

ఓమ్ తత్ సత్

శ్రీమహేశ్వరమందిరమ్,
తిలభాండేశ్వరవీధి, కాశీ.

మాధవచైతన్య బ్రహ్మచారీ,
వేదాంతశిరోమణిః న్యాయమీమాంసాచార్యః.

ఓమ్

సాధారణముగ నాధ్యాత్మికాసక్తిలేని లౌకికుల చేతిలో మూల భగవద్గీతను బెట్టిన నేవగింపు జనించును. అటులనే నపరిచితులు గీత యొక్క మహదుత్కృష్టత, ప్రాభవముల తెలియకుండనే, సంస్కృతమున నుండియుండు మంత్రపూతమైన మహత్తర శ్లోకముల చవిచూడకనే నొక మూల బెట్టుదురు. వీటికి కారణము మూలపఠనమం దౌత్సుక్య పరచు, నుత్తేజమొనర్చు విధానము లోపించుటయే; క్రియాత్మక కాధ్యాచరణకై వలయు ప్రోత్సాహము వారి వారి యాంతర్యమునుండి వారి వారికి సముచితముగ లభింపమియే.

పూజ్యశ్రీ సహజానందు లీలోటు బాటులను తొలగించి ప్రజాకోటిలో గీతాచైతన్య ముద్రిక్తపరచుటకై నష్టాదశా (18) ధ్యాయీ గీత నంతటిని ప్రశ్నలు, జవాబులు రూపమున చక్కటి యుపమానోపమేయాదులతో ప్రఫుల్లిత గురుప్రసూన సురభిళమును వెదజల్లుచు నీ బృహద్గ్రంథ ప్రచురణద్వారా తమ మూలమున పాఠకులును, పాఠకుల మూలమున తామును జీవితములు ధన్యమొనర్చుకొనిరని మా దృఢ విశ్వాసము. ఈ గ్రంథమందలి విశిష్టత యేమన నామూలాగ్రముగ వ్యావహారిక భాషయొక్క వాడుకమాత్రమేగాక, గురు శిష్య సాంప్రదాయానుసారేణ శిష్యుని (లౌకికుని) సర్వసందిగ్ధసమస్యల గురువు ముఖాముఖిగ తగు రీతిని పరిష్కరించి సంతృప్తి నొసగుటయే. ఈ "ప్రవచన గీత" సర్వజనసమాదరణీయమనుటలో నెట్టి యాక్షేపణ యుండజాలదు.

హరిః ఓమ్ తత్సత్

Swami Sivananda

("స్వామి శివానంద")

ఏడువందల పుటల కొకింతమించి యొప్పారుచున్న నీ బృహద్గ్రంథ మున నుపోద్ఘాతము 30 పుటలు, 701 శ్లోకమయ సంపూర్తి 18 అధ్యాయముల మూలము 70 పుటలు, మిగిలినది 'ప్రశ్నోత్తరము'ల రూపమున నత్యంత సన్నిహితులయొక్క నాంతర్య సంభాషణవలె చూపట్టుచు సాధారణ జనులకు దురూహ్యాము, దుర్గ్రాహ్యామగు పదునెనిమిది యధ్యాయములందలి బహుముఖ ప్రశ్నలకు సుబోధకముగ నుపన్యాస (ప్రవచన) ముల తీరులో జవాబులు గద్యరూపమున మనోరంజకముగ హృదయమునకు హత్తుకొనురీతి నొసగబడెను.

ఈ గ్రంథము చదువువారికి రచయితయొక్క పాండితియు, నింకను నాయన పరమపూజ్య శ్రీమలయాళగురుల అడుగుజాడలలోని శిష్యుడుగను స్వయంవ్యక్తమైతీరును.

చదువువారికి పదేపదే చదివి జీర్ణించుకొన నాకాంక్ష యుబ్బుననుట లోను, తప్పనిసరిగ గీతోపాసకులు పరిభద్రమొనర్చుకొని ననవరతము గమకింపదగు గ్రంథమనుటలోను నతిశయోక్తిలేదు.

సుందరమగు నేనైన కూర్పు, ఉత్తమమైన ప్రచురణ.

గ్రంథాలయములకమూల్యమైన నలంకారము లేదా నూతన శోభనొసగ గలదు.

గ్రంథకర్తతోపాటు శ్రీ వేదవ్యాస ముద్రాక్షరశాలాధిపతులు (చిత్తూరు) ను నిప్పట్టున బహువంద్యులు.

"శివానంద పాదసేవక"
S. P. S. స్వామి శ్రీనివాసానందసరస్వతి.
శివానందాశ్రమము, హృషీకేశము.

# విషయసూచిక

ఓం

# ఉపోద్ఘాతము

పక్షిజాతి తమశక్తికొలది నాకసమున ప్రతిదినము విహరించుట అలవాటు. అవి అట్లు విహరించుట నాకసముయొక్క అంతుపొంతు తెలిసికొనవలెననిగాదు. లేదా ఆకసము అంతుపొంతు తెలిసికొనలేక పోయినను తప్పుకాదు. తమ అలవాటును తమధర్మమును వదలవు. ఆకసమున విహరించుటలోనే తమకు నానందము. ఇక మానవులందరూ ప్రజ్ఞావంతులు, లేదా విజ్ఞానవేత్తలు రాకెట్ వంటి కృత్రిమయంత్రములను నాకసమున వదలుచున్నారు; విమానములనెక్కి తిరుగుచున్నారు; తిరుగగలరు. గ్రహముల కనిపెట్ట ప్రయత్నింతురు. కాని ఆకసముయొక్క అంతుపొంతు నెన్నటికి తెలియలేరు. తెలియలేకపోయినను ప్రయత్నము చేయుచునేయుందురు. తద్రీతి శ్రీమద్భగవద్గీతా తత్త్వరహస్యవిమర్శన మానవులు చేయక మానరు. ఇయ్యది మానవుల ధర్మము. ఇందులోనే వారికి ఆనందము, ఆశయసిద్ధిగలదు. దాని నిజార్థమిదియేయని గ్రహింపలేక పోయినను సర్వవిధముల జేయగలరు, జేతురుకూడ. కాని తత్త్వమిట్టిదని నిర్దేశింప నెవ్వరు సాహసింపరు, సాహసింపలేరు. శంకరునివంటివాడే దుర్విజ్ఞేయార్థమనెను.

ప్రపంచమున తత్త్వజ్ఞులెల్లరు గీతకు భాష్యములు వ్యాఖ్యానములు టీకానువాదములు, తెలుగున గద్యపద్యములు, బుఱ్ఱకథలిత్యాదులు లెక్కలేనన్ని ప్రకటించియున్నారు; ప్రకటింపగలరు; ప్రకటింపవలసినదే. సంస్కృత, ఆంధ్ర, తమిళ, కన్నడ, అరబ్బీ, ఆంగ్లేయ ఇత్యాదిభాషలలోగూడ ప్రకటితమైనది. ఏదేశమువారైనను, ఏమతస్థులైనను, పురుషులైనను, స్త్రీలైనను, తమతమశక్తిసామర్థ్యముల భగవత్తత్త్వమును విమర్శించి వివరించి తృప్తిబొందవచ్చును. అంతరంగవాసియు, సర్వవ్యాపియునగు భగవంతుని అపరస్వరూపులు మానవులగుట తప్పనిసరి గీతకు తమతమ యభిప్రాయము వ్రాయవచ్చును.

భగవత్తత్త్వమును తెలియుట చాలకష్టము. భగవద్గీతా తత్త్వము కూడ తెలియుకష్టమే. గీతాతత్త్వమును గ్రహించిన భగవంతుని తెలియ

గలరు. గీతార్థమును జీర్ణమును ఏవిధముగ జీర్ణింపజేసుకున్నను, తాము భగవత్ప్రాప్తి పొందుటయేగాక అనేకులకు నుపకారమొనర్చినవారలగుదురు. ఏ ఒక్కరో మాత్రమే గీతార్థము వివరింపను వ్రాయనసర్హులని, తక్కినవారనర్హులనరాదు. అనుటకెవ్వరికి సాహసము చాలదు. గీత యొకరిదికాదు, సకలమానవులకు హక్కుగలదు. ఏ ఒక్కరిదో అయి వుంటే గీత కింతటి ప్రశస్తము గలుగనేకలుగదు. సంకుచితహృదయముల, రాగద్వేషముల మానవులు భావమును, క్రియల సహింప నోపనిచో తాము నారాయణుడే నరుడను మహత్తరస్థితినుండి చ్యుతులగుటయేగాక భగవత్ప్రీతికి దూరులై విశ్వజనద్రోహులగుదురు. అటుగాక జనసామాన్యమునకు భగవత్తత్త్వమును సులభమార్గమున తెలియపఱచిన సర్వదానందదాయకులు, కీర్తికరులు, లోకోద్ధారకులగుదురు.

పండితప్రకాండుల యంతరంగమంటే భావగూఢమై, దాచిన లోభిధనమువలె, గంభీరముగనుండు నే పరమార్థమైనను లోకమునకు హితకారి కాదని నా నమ్మకము. రోగగ్రస్తుని సమీపమున వివిధరసముల పిండివంటలు ఫలహారాదులున్నను తినయోగ్యముకానట్లు, న్యూనాధికులెన్ను యవిద్యాభిమానరోగమున్న వివిధార్థపదార్థరహస్యధర్మరూపిణి యగు గీతాతత్త్వము జీర్ణించుకోసాధ్యముకాదు. సకలప్రాణులకు సూర్యప్రకాశమవసరమే. సూర్యుడును పక్షపాతికాడు. గీతాధర్మము, గీతాజ్ఞానము, గీతాకర్మము, గీతామర్మము, గీతాగ్రంథమందరకవసరమే. గీతాచార్యుడు గీతాగ్రంథమునకు పక్షపాతము సాంప్రదాయకుల భావమువలె లేదు. నానావిధమానవులకందఱకు నందుబాటుగల్గించుటే పురుషార్థము, పరమధర్మము, శ్రేష్ఠముకూడ. తల్లి తన స్తనములందలి పాలను కనికందులకు నుపయోగించుటయందు ఒకవేళ జన్మించకమునుపే శిశువులకయ్యే తన స్తనముల భగవంతుడుంచిన పాల రహస్యముగనున్న పిల్లలకు కాదని తల్లిచెప్పగలదా? అవి బిడ్డలకేనని తనకుగాదని తల్లిపిల్లకే నుపయోగించి స్వతంత్రులను జేయుచుండుట లోకమెఱుగదా? లేక పక్షపాతముజేసి పిల్లలకు తన స్తనముల పాల నీయనిచో గలిగే రోగబాధ తానే యనుభవించటము. పిల్లలనోట దుమ్ముకొట్టిన పాపము. పైగా నపకీర్తి. సరిజనులలో తలయెత్తి తిరుగగలదా? భగవద్గీతా పరిగ్రహమున నంతయర్థమె

వాటిల్లదా! భగవంతుడే జగత్తునకు తల్లి దండ్రి గురు దైవము తోడు నీడ. ఆయన స్వరూపమును తెలిసినకాని మానవులకు శాంతిలేదు. ఆయనగానే లోకమునకొసంగిన ఆయన దివ్యసందేశవాక్కుల, ధర్మ రహస్యముల వినకూడదనిగాని, చదువకూడదనికాని యనుటలో స్వారస్యములేదు. పాఠశాలనిర్మాణము బాలబాలికలచదువునకేగా! మానవత్వము భగవంతుని గనుగొనుటకేవచ్చినది. ఆ జ్ఞానవిజ్ఞానసత్స్వరూపుడగు పరమాత్మయొక్క వ్యక్తరూపములే ఈ నానాకారములుగలవి. ప్రకార(జాతి) భేదముకాదు. పరిమాణ (తరతమత్వ)భేదమే. మన కాళ్ల క్రింద ప్రాకు క్షుద్రకీటకములకును, లోకమున నుద్భవింపగల మహోన్నత మేధాసంపన్నునికిని గలదికూడ జాతిభేదముకాదు; తరతమత్వభేదమేనని స్వామి వివేకానంద చాటించెను.

మానవులు గీతాతత్వరహస్యములను తెలిసికొనియే తీరవలె. జన్మసార్థకము మఱిదేనివలన గాదు. మానవుల కర్తవ్యమిదియె. "ఏకం సద్విప్రా బహుధా వదంతి" మహాత్ములనేకులు బహుమార్గముల గీతకు వ్యాఖ్యానము లొనర్చినను రానురాను ప్రతిమానవునియొక్క హృదయము నా స్వవిషయము, నా స్వధర్మకర్తవ్యనిష్ఠయేగదా గీతావిచారమని తెలియవలెను. ఖురాన్, బైబిలువంటి మతగ్రంథము లెన్నియో యుంటున్నవి. ఆ గ్రంథములందెంత యభిమానము నా మతగ్రంథరహస్యముల నా మతస్థులు సమానాదరణాతిశయముల గ్రహించుట లోకమెఱుగదా! మఱియు గీతయందట్టి యభిమానమేల నుంచరో శోచనీయము. ఎవరో వచించిన దురభిమానగ్రంథములను ద్రవ్యనష్టము, మనోదుర్బలత్వము, భేదశాసనముల గలిగించువానిని, పేరాశలు, చనిపోయినమీదట గలుగునో కలుగవో తెలియరాని ఫలితాల జూపించి, చిత్తకలక యశాంతవంతము గల్గించువానిని నేల వదలకూడదు? గుహ్యము, గుహ్యతరము, గుహ్యతమమని భగవంతుడు వచించుటలోని రహస్యమేమొ భగవంతునివలన నర్జును డెఱిగినట్లు మహాత్ములవలన తెలియవలెనని తోచెడిని. అయిన నూహాతీతమైన గీతార్థము గుహ్యమన శరీరమునయున్న నేనే. గుహ్యతరమన బ్రహ్మాండమునున్న పరమాత్మను. గుహ్యతమమన పిండాండ బ్రహ్మాండములగల జీవపరమాత్మ లొక్కటియను త్వంపద తత్పదముల

నిర్ణయార్థము. ఇది ఒక రహస్యము. కర్మ, ఉపాసన లేక భక్తి, జ్ఞానమను మూడిటి నిర్ణయము పదునెనిమిది యధ్యాయముల మూడు షట్కముల భాగించి మూడు రహస్యార్థములు ఆనగా త్వంపద తత్పద అసిపదముల నిర్ణయమని యానందగిరి మొదలైన మహాత్ముల యాశయము.

మదర్థము, మత్కర్మకృత్, మత్పరమ మనే రహస్యములుగూడ నింతే. గీతాప్రచారమవసరమని భగవంతుడే వచించెను. నాన్యసాధనము ధర్మగ్లానియైన లోకమునకు తన యమూల్యసందేశమే గీత. ఆ యవకాశమును పురస్కరించుకొని, ముక్తసరిగ దిగంతవ్యాపనము గీతాప్రచారమొనర్పవలెను. అన్యశాస్త్రములకంటెనూ - వానిని చదువ భాషనేర్వవలె; సంశయనివారణకు సన్న్యాసుల సేవించవలె. అట్టి వ్యవస్థ గీతవలన తొలగిపోవునుకదా! బైబిలు ఖురానువంటి ఇతర సాంప్రదాయక గ్రంథములు త్వంపద తత్పదముల శోధన యసి తానెవరు, పరమాత్మ యెవరను విషయము గనుపడదు. మానవుల స్వరూప స్వధర్మ స్వభావ స్వకర్మలకు ప్రతిబంధకమగు మోహమును మొదలంట కూకటివ్రేళ్లతో సహా పెకలించి వేసి, నిత్యనిరతిశయానందమగు స్వరూపసాక్షాత్కార మొనర్చు ప్రత్యక్ష ప్రమాణపూర్ణగ్రంథము గీత. గీతకు గీతయే సాటి "న భూతో న భవిష్యతి" విధిముఖ నిషేధముఖ ప్రత్యయాల కందని యాత్మస్వరూప తటస్థ లక్షణముల పురుషార్థప్రయోజనమే గీత.

ఒక దేశమునకు, నొక ప్రదేశమునకు, నొక వర్ణమునకు, నొక మతమునకు, నొక యాశ్రమమునకు, నొక కాలమునకు స్త్రీలు, పురుషులు, వృద్ధులు, బాలురు, బాలికలకని నిర్దేశ్యము గీతయందు గనరాదు. ఏ ప్రాంత్యపువారి భాషయందు బుట్టలేదు. దైవభాషయగు సంస్కృతము నందే నుద్భవించినది. సంస్కృతభాషను నేర్చిగాని లేక తమ తమ మాతృభాషలలోనికి ననువదింప జేసుకొనిగాని గీతాతత్త్వార్థము గ్రహించవచ్చును. సృష్ట్యాదియందే సూర్యునకు గీత చెప్పబడెను. ఏ నాడో యెక్కడ నుండెనో యనిగాని, కొంతకాలము నాచరణలో లేదనికాని చెప్ప వీలులేదు. సంస్కృతభాష నందతెలుగక దాని పొంతకు బోకపోయిన దోషము మానవులదేకాని, గీతాపుస్తకము గీతాధర్మము నొకప్పుడు లేదనికాదు. మనకు భాషలేదు, మఱియు నెమకలేదు. గీతా తత్త్వశాస్త్రము, యోగశాస్త్రము,

అనువాదశాస్త్రము, స్మారకశాస్త్రము, మానవాశయప్రదశాస్త్రము యను పేర్లతో నెప్పుడు విరాజిల్లుచున్నది.

భవరోగ దుఃఖనివారణమునకు నేకైకసిద్ధరసాయనమగు గీతను జన్మమెత్తిన ప్రతిమానవుడు చదివి జీవితసంగ్రామమున సతమతమై సమసి పరమగతిదూరులై జ్ఞానభ్రష్టులుగాక కర్తవ్యమును తెలిసి సిద్ధిని బొందుట లెస్స. ఏడునందల శ్లోకములున్నవి. మహామంత్రములు, వీనియందే నష్టాక్షరీ, ఏకాక్షరీ, సప్తాక్షరీ మంత్రములు విరాజిల్లుచున్నవి. సుప్రసిద్ధమై ఋషిన్యాస, కరన్యాస, అంగన్యాస యుక్తములై యున్నవి. ప్రస్థానములందు సగ్రస్థాన మలంకరించినది. గీతను గురించి వ్రాసిన వ్యాఖ్యానముల మించి నేనే క్రొత్త ప్రతిపాదన వ్యాఖ్యానముచేసి, పేరు ప్రతిష్ఠల నొందవలెనని నా యాశయముకాదు. నా యంతరాత్మయగు పరమాత్మ యెంత కాలమునుండియో నన్ను ప్రత్యహమునను ప్రబోధించుచుండ నా కర్తవ్యమిదియే యని "బహుజన హితాయ" జనసామాన్యము సులభముగా తెలియుటకొఱకే నా యుద్యమము; మరేమియుకాదు. ఏడునుండి 10, 12, 20, 100, 120 నెంబరు నాలుగు నెవరెవరి ప్రజ్ఞను చేతి మెలకువ తీసెదరు; లోకమునను వ్యాపక మొనరింతురు. ఒక చెంబునందు నీరుచల్లి యెండలు గొనిపోవుచున్నను, నీరు కొరతలేక యథాస్థితినుండుటలేదా? గీతా చెలమ వంటిది, ఏకువంటిది. ఎవరెవరి శక్తిసామర్థ్యముల నర్థముల ప్రతిపాదించుచున్నను చెలమ యేకువలె వ్యాపకమగుచున్నది.

గీతాచార్యుని సేవయే సాత్వికగీతాప్రచారము. కాలముతో, వ్యక్తులతో, సమాజములతో, దేశములతో గొన్ని ధర్మములు వృద్ధి నొందును. అదే ధర్మము లొకప్పుడు కాలగర్భమున వ్యక్తులు సమాజములతో సహా కలిసిపోవుచుండును. క్రొత్తధర్మము లవసరమగుచుండును. గీతాధర్మము మాత్ర మట్టిదికాదు. భూతకాలమునకు నప్పటిమానవులకు, వర్తమానకాలపు మానవులకు కాలమునకు, భావికాలమునకు నూతనమైనదిగానేయుండును. అందుకే భగవద్గీత యనిపించుకున్నది. సనాతన ధర్మమే గీత. మచ్చునకు నేటిరోజున నొక శ్లోకము దీసికొని దాని కర్థము నీ రోజు చేసితిమా, అదే శ్లోకము రేపు మఱొక అర్థమును స్ఫురింప జేయును. నిజముగా భగవంతుడు కన్నులకు గనిపించలేదనువారు, ఏవిధ

మునవో మత సాంఘికధర్మము ననుసరించి స్మరణాదుల జేయువారు, భగ
వంతుడే లేడనువారు గీతను ఆద్యంతము చదివి తాత్పర్యము గ్రహిం
చితే చాలు; తమ నాస్తిక్యమునకు స్వస్తి చెప్పించగలడు. దానిని తెలిసిన
వాడు తనకు తలిదండ్రులే లేరు వచ్చితిననగలడా? ఎట్టైన నుండదా?
నుండదు. తన తండ్రికి బదులు తాను, తన తండ్రి దస్తూరితో వ్రాతలు
కాదనునా? కాదనలేడు. ఆ సిద్ధము భగవంతుని సగుణరూపమే వ్యక్త
మగు విశ్వము. ఇదే శబ్దబ్రహ్మము. తన సగుణాకారమే శబ్దబ్రహ్మ
మగు గీత. ఈ విషయమునే గీత మాటిమాటికి చెప్పుచున్నది.

పాశ్చాత్యదేశపు విద్వాంసుడగు డాక్టరు మ్యాక్సుమ్యుల్లర్ తన మరణ
సమయమున, హే భగవాన్ ! తిరిగి నేను బుట్టవలసివస్తే నన్ను భారత
దేశమున బుట్టించుమని ప్రాణముల వదిలెనందురు. ఎందుకు నాలాగు
దలంచెను? జర్మనుదేశమునకంటె ఇహభోగములు, యంత్రతంత్రములు,
మహత్తరవిషయములు భారతదేశమున గలవనియా? సాంప్రదాయకమన
ములతో, పక్షపాతములతో, ధర్మమును పేర సధర్మముతో, దోపిడి విధాన
ముతో సత్యదూరమైన వచ్చి సిద్ధాంతములతన్ను యున్నవైన, స్వార్థముతో
రాక్షసులా ! పైశాచులా ! పైశాచికములా! గ్రహములా! యని తెలియ
రాని జాతి, మత కక్షదారుల గుత్తభూమియగు భారతమున తాను గుత్త
దారుడ నగుదుననియా? కోట్లకొలది మాతృదేవతలగు స్త్రీలకు, పురుషు
లకు స్వాతంత్ర్యత, స్వేచ్ఛ సమానస్థితిలేక పరదేశస్థుల పాలైన పరిభవ
మానవులవలె కావలెననియా? రోగములు లేకనే, ఋషులు జెప్పకనే, దేశము
లెల్ల నడపకనే, సోదరమాహాత్మ్యమున సృష్టికి స్వర్గానికి నెక్కుడు పతిలేని సతి
వలె, వెలుగులేని చీకటివలె సమానాదరణ సర్వాహక్కులు లేకయున్న
దుర్బలమానవులవలె తానగుదుననియా? కాదు కాదు. మజ్జేమన, ఆర్ష
గ్రంథములు, అతీంద్రియజ్ఞానులగు మహర్షులుండినది. భగవదవతారము
లకు నగ్రస్థానమైనది. ఆత్మానుభూతి గల్గించు నుపనిషద్విభవసారమై భగ
వంతుని ముఖారవిందమునుండి జనించిన సుదర్శనమగు గీతాశాస్త్రము
లేదా అధ్యాత్మవిద్యాశాస్త్రము లేదా విజ్ఞానశాస్త్రమునకు నివాస
స్థానము ప్రస్థానము లనేకములు గలిగియుండు దేశమగుట నా ప్రస్థానముల
నాత్మానుభూతి తనివిదీర నొందవలెనని గోరనేకాని మతాంతరమునకుగాదు.

స్వామి వివేకానంద యొకప్పుడు 'నా దేశమున నొక కుక్కయైన పస్తుపడి యున్నంతవఱకు దాని కాహార మిడి రక్షించుటయే నా పరమధర్మము. ఇదియే నా మతము. తద్భిన్నమంతయు నధర్మము, కృత్రిమధర్మము. సమస్తజీవరూపుడగు నద్వితీయుని విశేషము నాయార్త నారాయణుని సమస్తదేశీయుల కెల్ల బీదయగు నా భారతనారాయణుని నా యిష్టదేవత నర్చించుటకై నెన్ని జన్మములైన నెత్తెదనుగాక! ఎన్నివేల బాధలైన ననుభవింతునుగాక!' అని కలలగని యదేవిధమున యన్నదాన, విద్యాదాన, జ్ఞానదానముల నేడఖండదేశసేవ లేదా ప్రపంచసేవ రామకృష్ణ మతము యిత్యాది సమాజముల స్థాపించిన దేశభక్తాగ్రగణ్యుడు, విశ్వమానవ ప్రేమపూరితుడుగాడా! తదుపరి భారతదేశము జాతి మత కక్షలతో సాంప్రదాయ పక్షపాత పిసాసులతో పరదేశస్థులకు బానిసయై పరదేశస్థుల పాదాక్రాంతమైనదాని నిష్కామయోగి, సత్యాహింసాయుధములధారి, విశ్వవైతాళికుడగు మహాత్మాగాంధీజీ దేశస్వాతంత్ర్యమును, భారతీయుల బంధవిమోచన మొనరింపడా. ప్రతిభారతీయుడు ప్రస్థానముల నగ్రగణ్యమగు గీతాశాస్త్రమును చదివి, చదివించి నందఱ జ్ఞాన విజ్ఞానులనుగా నొనర్చి భగవత్ప్రాప్తి నొందుటకు దగు సాధనముల గీతాసమాజముల దేశమెల్లెడల నునిచి, పాఠశాలలయందుగూడ పరీక్షాగ్రంథముగానుంచి, యంధవిశ్వాసములు, నయోమయస్థితుల నమాయక దేశముగాజేయక, నద్వితీయ పరమేశ్వర సగుణవ్యక్తరూపములే మా యీ భారత నాగరిక యనాగరికమున వెలయు మాతృదేవి సంతానము. ఈ సోదర సోదరీ మణుల సమానజ్ఞానవిజ్ఞానముల నశేష సేవజేయుటకై నెన్ని కష్టముల, నెన్ని జన్మములైన నెత్తగలమను ధీమంతులదే గీతాసేవ, గీతామాత.

స్వేచ్ఛయు, స్వాతంత్రము, నిరతిశయానందము గోరు ప్రతిజీవులలో తత్ప్రాప్తిప్రదగణ్యధన్యులు మానవులు. ఆ మానవులయందు భారతీయులు ప్రథములు. సుదర్శనాయుధుడగు హరి జన్మదేశము భారతీయము. "దృశ్యతే అనేన ఇతి దర్శనమ్" మెల్లఁజూడక దేని దర్శించిన (తన) దర్శనమగును. సత్యమును దర్శించుటకు సుదర్శనమ్. అవిద్యా మెల్లచూపు జూడ తొలగినంతనె 'సు' చక్కసిజ్ఞానము, దాన దర్శనము గాగలది తన స్వరూపము. ఎముకల గోడలు, మాంసపుమట్టి, తోలుతిత్తి, యూశార

కరమగు దుఃఖనివృత్తి యానందప్రాప్తికి హేతువులగు దర్శనోపనిషద్గీతల ప్రాధాన్య మాంధ్రమున ప్రచారమున్నట్టులేదు. ప్రాచీనమగు మత సంస్కారముగాని, ఏతత్సంబంధమగు సారస్వతముగాని లేదు. అదేగాక యిందే బుట్టి నిచటనే నిలిచి ధర్మప్రచార మొనర్చిన యాచార్యపరంపర లేదు. మచ్చునకు చూడుడి. కేరళమునకు శంకరుడు, అరవలకు నాయనారు, లాళ్వారులు రామానుజులీతీరు ప్రతిప్రాంత్యమునకు గలరు. సంస్కృత భాష చాల తక్కువ. శుద్ధాద్వైతకర్తయగు వల్లభుడు, ద్వైతాద్వైత కర్తయగు నింబార్కుడు జన్మతః ఆంధ్రులేయైనను, వారి ప్రచారమంతా నుత్తరదేశమునసే జరిగినది. ఇంతను నాయాకారణాలవలన నాంధ్రులకు జెప్పుకోదగినంత దర్శన శాస్త్రోపనిష ద్వాఙ్మయముగాని, మతసంబంధ మగు రచనలుగాని, ధర్మప్రబోధములుగాని లేవు. ప్రస్తుతనాంధ్రులు విమర్శించిన తెలియగలరు.

ఈ కొఱతను యనగా మాతృదేవతలగు స్త్రీలకు, ప్రతియొక్క పురుషసోదరునకు సంస్కృతమును, దానికి దగిన బ్రహ్మచర్యవ్రత నిష్ఠానుకూలసాధనలు, విరక్తజనులకు వైరాగ్య జ్ఞాన కర్మ భక్తి సాధనలు మోక్షమునకు సోపానములుగ క్రమముగ నొనరింపజేయుచు, నాబాల గోపాలము దైవమంటే, సత్యము ధర్మములంటే, మోక్షమంటే, మానవత్వమంటే, పునర్జన్మమంటే, జీవుడంటే, ప్రపంచమంటే, జననమరణములంటే, సంసారమంటే, గృహస్థ వానప్రస్థ సన్న్యాసములంటే, మానవుల కర్తవ్య మేమిటి యనే తెలుపుటకు మాసపత్రికను, వేదపాఠశాలను, సంవత్సరమున కొకతూరి నొక్కొక జిల్లా లేదా ప్రాంత్యముల సనాతనవేదాంతజ్ఞానసభయను దానిపబన నలుమూలలనుండివచ్చిన జన సామాన్యమునకు సన్మోదకముల దృష్టి నొసరించుచు, భక్తి జ్ఞాన వైరాగ్య ధ్యాన కర్మ యోగ రహస్యముల నెఱింగిన మహాత్ముల ననేకుల నాహ్వానించి వారి ద్వారా నుపన్యాసంబుల ప్రతివారి హృదయకుహరమున పవిత్రధర్మబ్రహ్మబీజముల విత్తింపించుచు మానవసేవయే మాధవసేవయను రీతి గీతయంటె నేలపైన గీయు గీతయా? లేక పలకపైన గీయు గీతయా? అని యెంచు నాంధ్రులకు భగవద్గీతా రహస్యమును వారి వారి హృదయఫలకముల హత్తింపజేసి, హస్తములయందు గీతనుబట్టి చదువను ప్రోత్సహించి, పదమూడు వత్సర

ములు తప మొనరించి, నైష్ఠికబ్రహ్మచర్యమున తన తపఃఫలము తన శ్రేయస్సు తోడిమానవుల కేసని జన్మతః కేరళమైనను నాంధ్రమున వేద వ్యాసాశ్రమమనుపేర నొక యాశ్రమము స్థాపించి, కన్యాగురుకుల పాఠశాల, బ్రహ్మవిద్యా పాఠశాల నునిచి, విధి విరామములేకుండ నపర వ్యాసులవలె నాంధ్రమాత బిడ్డల కపార సేవజేయు మహర్షి మలయాళస్వామి నెఱుగనివారు ఆసేతు హిమాచలమధ్య భారతమున లేరు. వారి సేవ యమోఘమగుట నాంధ్రులు నిద్రనుండి మేల్కొనినట్లు మేల్కొని చైతన్యవంతులై విజ్ఞాన జ్ఞాన విద్యాప్రభల సమానసోదర సోదరీమణులై నిప్పు డిప్పుడు దిశల కలయజూచుచున్నారు. ఒక్క యాంధ్రదేశమే కాదు, సమస్తభారతావనియే కాదు, మానవ మనుగడున్నచోట నెల్ల గీతా ప్రచార మవసరము. ప్రతిదేశమువారి మాతృభాషలోనుంటే నియ్యది స్వకపోలకల్పితమనవచ్చు. నేర్చుకొనుటకుగాని గ్రహించుటకుగాని దైవభాష యందు గీతయుండుటచే స్వతస్సిద్ధముగ భగవంతుడు చెప్పినదియేః మానవ ప్రోక్తముకాదు. ఏ మతస్థులైనను, నేభాషాపరులైనను తమ తమ భాషల లోనికి ననువదించుకొని భగవత్ప్రాప్తి బొందుటకు గీతాపారాయణము తాత్పర్యముల నెఱింగి యనుభవ మొనర్చుకొనవలెను. ఆస్తినాస్తులలో గాని మఱే రాజకీయమునగాని కాలానుగుణ్యముగ నీవు నాకు యనే యాతురతతో నీవు ముందా, నేను ముందా యనిగాని విపరీతదృష్టి గలుగ వచ్చు. ఈ గీత భగవంతుని వాణి. విశ్వమయునిలోనివే కాలములు, దేశములు. జీవులు భగవద్గీతవంటి పరమప్రమాణ శ్రేయస్కరమైనది మఱొకటిలేదు. మానవుల స్వరూపస్వధర్మమును, స్వభావమును, స్వకర్మ యనే నీ నాలుగు లక్షణముల సాధనముల సిద్ధావస్థ నొంద సులభముగ తెలిపి భవభీతిబాపు మహోపకారి "తచ్చింతనం తత్కథనమ్" అన్నట్లు గీతాచింతన, గీతాకథన మన్యోన్యమగు తత్ప్రబోధనము తదేకత్వమే నిరంతరము చేయవలెను. ఫలము అభేదమును, అద్వైతానందము స్వతస్సిద్ధము నిర్వచనము.

అపమానమైన మానవత్వము లభించటమే నొక భాగ్యము. సదరు మానవత్వము యే దేశములనో, ఏ కాలములనోగాక, నేకాలములనైనను నాసియాఖండమున భారతదేశమున జన్మించటము మఱియొక యదృ

ష్టము. ప్రాచీన అతీంద్రియజ్ఞానులగు ఋషిగోత్రీయులై ,వారి యానాటి యాశీర్వాదబల మెల్లప్పుడు కలిసివచ్చుట మిగుల భాగ్యము. భగవదవ తారములకు నెలవై బ్రహ్మర్షి, దేవర్షి, రాజర్షి, మహర్షి, ఋషి, యతి, మౌని, పరమహంసాది మహాత్ములుదయించి, నివసించిన పరమగమ్యము. సత్యాహింస, తపోవిద్యా త్యాగ ప్రేమ బ్రహ్మచర్య మార్జవ క్షమా స్తి క్యాది ధర్మరక్షిత పూరుషాకార దీక్షితదక్షులగు నుదారమహాశయుల జన్మ భూమి. వేదాంత సాహిత్య రసపోషణమునకు నాటపట్టు. బుద్ధ,జిన, శంకర, రామానుజ, మధ్వ, రామకృష్ణ, వివేకానంద, రామతీర్థ, బాలగంగాధర తిలక్, మహాత్మాగాంధీ, రమణ, యరవింద, మలయాళ మహర్షి ప్రభృ తుల పీఠస్థలము. కృష్ణార్జున సంవాదరూపంబగు వేదసార వేదాంత రహస్య ధర్మ ప్రతిష్ఠిత సకలమత సామరస్య సార్వభౌమత్వ త్రిలోకారాధ్య పూజ్య గీతాభ్యుదయ కురుక్షేత్రస్థ పావనధరణి స్వాతంత్ర్యప్రియుల కాదర్శనీయ పవిత్రయాత్రాస్థలము, నిరుపమానమగు నీ దేశముననుండుట యత్యంత పురాకృత సుకృతము,నిరుపాధికమును శాశ్వతనిరతిశయానంద పరబ్రహ్మము నొందుటకై సాధన మొనర్పక యుపేక్షించు జీవితము నిరర్థకము. సూర్యుడు వెలుగు, చంద్రుడు ఓషధీతతుల వర్ధిలజేయు,మానవులు జీవింప, సకల సస్య ఫల తరు నదీయుతములు జీవనదాయకములుగా వేదశాస్త్ర ములు యాశయసిద్ధికి మడుంగులొత్తి సాదరమున సుఖమార్గముల జూపు చుండ సుసంకల్పంబులు వందిమాగధులై పరివేష్టింప నున్నతోన్నత నొందక తాపత్రయ నీషణత్రయముల జిక్కుపడి తెరవుగానని మానవులవలె నుండ తగదు. మానవులన యచేతనములగు కాష్ఠపు బొమ్మలు, రాతివిగ్రహ ములు, మాంసపిండములుగాదు. చైతన్యస్వరూపులు, ప్రకృతినిధానులు, నిత్యముక్తాత్ములు. ప్రతిమానవునియందు దేవత్వము, పూర్ణత్వము స్వత స్సిద్ధముగనే గలదు. తత్ప్రకటనమే మతము, ధర్మము, విద్య యనె స్వామి వివేకానంద.

జ్ఞానేంద్రియ పంచకము, వానికి విషయములగు శబ్ద స్పర్శ రూప రస గంధాభాసకత్వమే ప్రపంచము. ఇట్టి ప్రపంచమున పురుషుడుగానో, స్త్రీ గానో యుండి కర్మేంద్రియముల క్రియల నాచరించుచు, నంతరేంద్రియ ముల, నీషణత్రయముల ననుభవింప సంకల్పవాసనా వ్యాకోచ మోహా

తులై, యాత్మజ్ఞానదూరులగుట, వారికంతే కనబడటము, అంతేగనుండ టము. జడచేతనములు మిశ్రితములై స్థూలసూక్ష్మముల గమని యున్న చేతనము గ్రహించ యజ్ఞానులకు సాధ్యమా? పరమాత్మ స్వామిని ప్రకాశింపజేయుటకు చదువుతనుండి, కాష్ఠమునుండి రాపిడిచే నగ్నిని బుట్టించు నది ప్రజ్వలితమై ప్రయోజనమగురీతి సాధనల మూలమున బాగా శ్రవణ మనన నిధి ధ్యాసములనే రాపిడి నిరంతరము గల్గింపవలెను. "యావ ద్విజ్ఞానసామీప్యం తావచ్ఛ్రేష్ఠ్యం వివర్ధతే" ఎంతెంత విజ్ఞానసామీప్య మగునో, అంతంత శ్రేష్ఠ్యత్వము వృద్ధిపొందును. జ్ఞానులగు శ్రేష్ఠపురు షుల నిత్యజీవితమేది? అజ్ఞానులగు పామరమానవుల నిత్యజీవితమేది? గమ నించితిమా! అల్పములగు ఇంద్రియసుఖములే పరమార్థము, పరమార్థ మని, శాశ్వతము, సర్వానర్థనివృత్తము, నిత్యస్వతస్సిద్ధము, సహజానందము తెలుపగక సుఖకలల దిబ్బనిగాచ లేక సీసుగు పంటల లేక స్మశానముల బండి స్వర్గకలలుగను కుక్కలవలె గనుచు, భోగసుడుల దిరుగుచు, స్వార్థ ఫల కెరటముల మునుగుచు, నాశప్రవాహవేగమున కొట్టుకొనిపోయి తుదకు నంతు పొంతు తెలియ సాధ్యముగాని, దాటరాని యుప్పు సంద్ర సమమగు సంసారజలధి మునుగుచు, తేలుచు కళలులేని చంద్రునిభాతి, రాహుగ్రస్త సూర్యునివలె, వలబడ్డ మృగము భంగి, చంద్రునిగానని చకో రములవలె నిర్వీర్యులై యుండుటయే సొబగా? ఒకచోట పోయినవస్తు వొకచోట వెదుక లభించునా? చీకటిలో కనిపించని వస్తువును వెలుగున్న చోట వెతకట మెట్లు? చీకటిని బోగొట్టితేగాని వస్తువు కనిపింపదు. వస్తువు లభించినగాని తృప్తిలేదు. తృప్తి లేదా సుఖము లేక శాంతముండదు. లేక పోతే మానె యనుకుంటే చింతాశాంతి దుఃఖములు తొలగవుగా? చింతిం చితే చీకటి తొలగదు, వెఱచితే కరుణించి కదలదు, బెదరించితే పారి పోదు, పిలిచితే పలుకదు, మఱచితే నున్నదున్నట్లుండును, వేసరి వదలితే పతనమే, విడిచితే విడువదు, రాళ్లమోదినా, గుదిపెల గొట్టినా, చేతుల జఱచినా, అస్త్రముల ఛేదించినా, తుపాకుల కాల్చినా, కలహా మొనర్ప బోయిన, విసరిపారవేయబోయిన, దేనిలోనికైన జొనిపిన, గాక మంత్రమొ, జపమొ, తపమొ, వ్రతమొ, కట్టు, వాకట్టుల, ఆజ్ఞల, శాపములు పెట్టిన [illegible] తానే పారిపోయిన తొలగదు. ఈ పనులన్నియు వెఱ్ఱి, పిచ్చి,

యున్మత్త, చేష్టలుగా నుండును. ఇట్టి నాంద్రేందఱు తోడైన జాలిగా మొరబెట్టుకొన్న ఏ దేవో దేవతల ప్రార్థించిన, నెట్టి యార్చన లొనర్చిన, ఏ దేశముల కేగిన తొలగదు. దేవతలనే వారు తాము తొలగించుకొలేకుంటే యితరుల కెట్లు సహాయ మొనర్తురు?

తనమీదబడ్డ దోమను తొలగించుకొలేక యెదుటివానిమీదబడ్డ యేనుగు నెత్తబోవుటవంటిది. చతుష్షష్టికళల, చతుర్దశవిద్యల, మతభేదముల, విద్యాగారసముల, ప్రశస్తాడంబరముల, స్వాత్మస్తుతుల, పరతిరస్కారముల తలపడిసపట్టు వీడదు. అసంతోష తొలగిపోదు. అన్యులెవ్వారు బంపినదికాదు. అంగడిలో నుండునదొకటి యడగట మొకటి, వుండేదొకటి చెప్పేదొకటి, చేయునదొకటి లభించునదొకటి, తలపొకటి ఫలమొకటి, వ్యాధి యొకటి మందొకటి, పుండొకచోట మందొకచోట, ప్రయాణమొకటి చేరునది యొకస్థలము, మంత్రించేదొకటి మనలోనుండునదొకటి, చెప్పేదొకటి వినేది యొకటి, చెడిటి శిష్యుడు గ్రుడ్డిగురువు, మాచకమ్మ నపుంసకుని సంతానమువలె నస్తవ్యస్తమగు నీవ్యవహార మెట్లనర్థకమో చీకటి నివారణోపాయములుగాడ నిరర్థకములేను. ఏమి జేసిన చీకటి తొలగును? దీపము వెలిగించితే చాలు వుండమన్న నుండదు, కనిపించమన్న గనిపించదు. ఇక దాని దర్శనమే యుండదు. అసలువస్తు వగుపడింది, యశాంతి తొలగింది, మనస్సున కుదురు దొరికినది.

అనాదినుండి హృదయమున అజ్ఞానమను చీకటి తిష్ఠ వేసికొనియున్నది. భాగవతమున ప్రహ్లాదుడు అచ్చపు చీకటింబడి యని పద్యము జెప్పెను. ఆ యచ్చపు చీకటిదో యజ్ఞానము. అచ్చమని యెందుకనెను? సూర్యుడు చంద్రాగ్నులతో చీకటి తొలగును. వానివలన నీ యజ్ఞాన చీకటి తొలగదు. అందుకై అచ్చపు చీకటి యనబడును. గీతయందనేక చోట్ల నీ చీకటిని భగవంతుడు జ్ఞాపకము జేసియున్నాడు. అసలు అర్జునుని మోహామునకీ యజ్ఞానమను చీకటియేకదా కారణము! ప్రతివారి హృదయమందలి చీకటి తమ తమ స్వరూపముల మఱపింపజేసి భీరువులుగా దీనులుగా జీవితభయము, జీవితాంతరభయము, జన్మమృత్యుభయము, లోకలోకాంతరవాసభయము, రాగద్వేషరోగలోభ న్యూనాధికభయము లనేకము గల్పించి దిక్కు పరదిక్కు దోపనీయక అడుగడుగునకు క్షణక్షణము

అనుభవించిన మంచిచెడ్డలు నాగమనములై అంతరదృష్టికి నడ్డురావటమొ, క్రొత్త క్రొత్త సూపశోభలతో మానసిక ప్రపంచ మేర్పరించటమొ, బాహ్య ప్రపంచవిషయ సౌఖ్యములు గిలిగింతలు బెట్ట, దశదిక్కుల జూచుచు, రాత్రింబగళ్ళనే కాలచక్రముల్ నిజీకొని బండారము బయటబడ పెదవులు తడుపుచు, నాశ్రితులకై వేగిరపడుచు, ఎండ సోకినంతనే ముడుచుకొను పుష్పలతాదులవలె భరజీవితమై యోచించుటకు నిండిన పాపపుణ్య మిశ్రమ కర్మఫల వాసనాజనిత చంచలమెఱుపుల శక్తి జాలకనుండుట మానవులకు తెలియనిదికాదు.

దీనికి నుపాయములేదా? ప్రస్థానత్రయమున ప్రసిద్ధివడసిన భవరోగ నివారణ మొసర్చు గీతాదీపమును వెలిగించితే సరి. హృదయకుహరమందలి భవబంధహేతువగు నజ్ఞాన మొక్క దెబ్బలో మటుమాయమై చూతమన్న కనిపించనిదై పోవును. మరల దాని నర్తనముండదు. ఈ జన్మమున లేకపోతే మరొకజన్మమున ముక్తి గావా యన్న, నీ యజ్ఞానముండిన జన్మములు వచ్చును. అజ్ఞానములేదా జన్మలెప్పుడు లేవు. ఈ ప్రశ్నకు అవకాశ మెక్కడ? పుష్పములు వికసించిన వాసనవచ్చు, చంద్రుని గనినంతనె యోషధులు సంతసించు, పౌర్ణమి రాగా సముద్రము డుప్పొంగు, భానుడురా చీకటి తొలగు, వర్షముగా వివిధప్రాణుల జీవనాడులు బలవంతములగు, ఔషధసేవవలన రోగము తొలగు, ఆరోగ్యముతో నిత్యసంతోషము, తలిదండ్రి దాత దైవ మిత్ర సుహృజ్జనునంటి గురువు గల్గిన ఘోరసంసార తాపత్రయ నివారకము, నిత్యానందప్రదము, అతులశాంతము, జ్ఞాన భూమికలు తుదముట్ట నజ్ఞానభూమికలు తమ పేరుతో నదృశ్యములగును. భేదదృష్టి తొలగి యభేదమే. అంతా స్వరూపమే, అతులిత స్వప్రసిద్ధాద్వయమే, ఖండములులేని యఖండమే. మన పాలిటి భాగ్యలక్ష్మి, విజయలక్ష్మి, అధ్యాత్మవిద్యారహస్య వివేకోదయ ప్రాప్త మోక్షలక్ష్మి, వాచ్యవాచకాభేదమగు గీతాలక్ష్మిని సేవించవలె. గీతాచార్యుడే లక్ష్మీవిభుడు, లీలామానుషవిగ్రహుడు, సర్వసాక్షి, భగవదిచ్ఛ. గీతాశయము మానవ ప్రయత్నము సఫలీకృతము గావలె, గీతామాతను అశేషజనులాశ్రయించి కృతకృత్యులు గావలెను. గీతాసుదర్శనశాస్త్రము పదునెన్మిదధ్యాయము

లలో నాద్యంతములు విమర్శించిన భగవంతుడు జెప్పినట్లు రెండే రెండు యోగములు లేదా సాధనములు; ఒకటి సాంఖ్యము, రెండవది కర్మము జెప్పెను.

ద్వితీయాధ్యాయమున జ్ఞానకర్మలను, తృతీయాధ్యాయమున కర్మ యోగ సమగ్రమును, నాలుగవ యధ్యాయమున జ్ఞానకర్మనిష్ఠలను యధికారులను, పంచమాధ్యాయమున కర్మజ్ఞాన విశేషములను, షష్ఠాధ్యాయమున క్లుప్తముగ కర్మజ్ఞాన రహస్యములను, నంతరంగసాధనమగు ధ్యానయోగనిష్ఠ తత్సాధనలగు సమదృష్టి అభ్యాసవైరాగ్యములు యోగభ్రష్టుని గతి కర్మజ్ఞానములకు మధ్య భక్తియుండవలెనని, సప్తమాధ్యాయమున జగత్సృష్టి చతుర్విధ భక్తులు మాయ ద్వివిధరూపులు, అష్టమాధ్యాయమున బ్రహ్మాధ్యాత్మ కర్మాధిభూతముల కర్మల ఫలితాల శుక్ల కృష్ణ మార్గములను, నవమాధ్యాయమున సృష్టి భగవద్విలక్షణత భక్తి యజ్ఞాదుల ఫలములు స్త్రీ శూద్ర వైశ్యాదులు పాపాత్ములైనను, తన్ను భజించిన మోక్షమిత్తుననియు, దశమమున తన విభూతులను విశ్వమంతయు తనయందు నేకాంశమనియు, ఏకాదశమున అర్జునునకు నేత్ర ప్రసాదము విశ్వరూపసందర్శనము, ద్వాదశమున సగుణ నిర్గుణ భక్తులు వారి లక్షణములు, త్రయోదశమున క్షేత్రక్షేత్రజ్ఞుల జ్ఞాన జ్ఞేయ ప్రకృతి పురుషుల రహస్యము, చతుర్దశమున సృష్టితత్వము గుణత్రయముల నతిక్రమించు నుపాయము వానివలన గలుగు ఫలము గుణాతీతుని లక్షణము భక్తివలన గుణముల నతిక్రమించు నుపాయము, పంచదశమున సంసార మాయా వృక్షరూపకాలంకారమును పురుషోత్తముడు తత్ప్రాప్తి సాధనములు క్షరాక్షరముల విమర్శ, షోడశమున దైవాసురసంపద, సప్తదశమున శ్రద్ధాత్రయ ఓంతత్సత్తులు తత్ఫలితములు, అష్టాదశమున సన్న్యాస త్యాగముల వ్యాఖ్య జ్ఞాన కర్మ భక్తి మార్గములను తత్ఫలితములను గీతా ఫల శ్రుతిని జెప్పబడినది.

విశ్వమునకు భగవంతు డిచ్చిన దివ్యవరప్రసాద సందేశమే గీత. భిన్నభిన్నములగు భక్తి కర్మ జ్ఞాన ధ్యాన మార్గములు మహత్తర యభేద దృష్టిచే సమన్వయము గాబడినవి. మానవుల స్వేచ్ఛకు, స్వాతంత్ర్యమునకు, పరమశాంతమునకు భంగకారియగు స్వధర్మకర్మ. కర్మయే జీవుల

పడు జీవులవలె, భయవంతులై, యేమి చేయుటకు దోపక, తోచినట్లు నడచువారు కొందఱు, జీవించినంతవఱకు కామసుఖముల ననుభవించి పోదామనువారు కొందఱు, కామసుఖములకంటె వున్నతమైన శాశ్వత సుఖ మొకటిలేదు. కాబోలు ననువారు, అథవా సుఖముండినను అట్టి ప్రాప్తికి తగిన జన్మము, అట్టివారి యిండ్ల బుట్టితేనేగాని లేకపోతే లభింప దేమో నని నిరాశపడి వేడి నిట్టూర్పులు విడుచువారు కొందఱు, అధికార ములు లేవని అదలించియైవ, దిగులుచేత దెసలు పరికించువారు, ఎవరెవరి ఏ కర్మకు నాలోకము, ఏ ధర్మమునకు నా ఫలము, ఏ వృత్తికి యిది తగును. నరకస్వర్గము లిట్టివి, పుణ్యాపాపము లిట్టివి, ధర్మ మిట్టిది, అధర్మ మిట్టిదని యందులకు తగిన ప్రమాణముల జూపుచు, తామొనరించితే మాత్రమే పాపములేదని, తామొనరించునది ఇతరు లొనరించిన పాపమని ప్రతియొక సత్యమార్గమునకు అడ్డుతగులు, పాపభీతిలేని సోదరమానవులతో ఉదార హీనులైన సమానసమానవసోదరు లదిగో దొంగలు పట్టుడన్న, దొంగల పట్ట జనినవారు దొంగల చేతిలోనివి దోచుకొని, దొంగలు పారిపోయిరన నిజదొంగ లెవరు? ఈ సంగతి పోలీసులకు తెలియునుగాని యితరులకు తెలి యదు. ఆ ప్రకారము తమ జీవితమే, తమ సుఖమే, తమ దిక్కే జూచు కొను స్వాత్మాభిమాన స్వార్థ కపట దంభాచార ప్రచారములతోడి మాన వులనే దొంగల నారాయణు డెఱుగును. నరనారాయణదేవుడు మనుజ మాధవుడు పురుష పురుషోత్తముడు జనజనార్దనుడు స్త్రీ పురుష రూపం బుల భారతావని పురుషోత్తము డవతరించు భూమి. ఆర్ష సంతతి ప్రకా శించి పర్యటించిన పుణ్యస్థలము. వేదవేదాంగములున్న విశాల ధర్మస్థల మున తల్లిలేని బిడ్డవలె, త్రోవ తెలియని పాంథులవలె, తలుపులుమూయు గృహస్థుల నిండ్ల తిరుగు నిరాశాభిక్షుకులవలె, మగంట్రోల్లని సతుల జీవి

తమువలె, ఎండ మాడు లతపుష్పములవలె, నమ్మించి గొంతుకోయువారి వలె, రక్షింప దిక్కులేక నేడ్చువారివలె, వెతలుబడు మానవులెందున్న ఏ ప్రాంతమునున్న అందరికి భగవద్గీతాప్రచారము, గీతారహస్యము, గీతాసందేశము, గీతాధర్మము, గీతామృతము, గీతాజ్ఞానము, గీతాశయము, గీతానుభూతి, గీతాప్రతిభ, గీతాసేవ, గీతాభవరోగ నివారణకైన దివ్య రసాయనము, స్త్రీ పురుషులకు నాబాలగోపాలము కాలాకాలములనక తెలుపవలసినది. అందరు తెలియదగినది. అప్పుడు మానవులము మానవులము, మానవత్వము మాధవత్వమనే జ్ఞానము స్పష్టమగును. అప్పుడే రామరాజ్యము. అప్పుడే సంసారమును స్వర్గముగ మార్చుటము, భూలోకమే వైకుంఠము లేక వసుధైక కుటుంబము, భవరోగ నివారణకైన వైద్యశాల, ఆనందక్రీడారంగము, బ్రహ్మక్షేత్రము, బహుముఖోద్దీపనము, స్వస్తి నిలయము గాగలదు.

ఓమ్ తత్ సత్

శాంతిః శాంతిః శాంతిః



ఓమ్

# వరాహపురాణోక్త శ్రీ గీతామాహాత్మ్యము

ప్ర॥ గీతామాహాత్మ్య మెందు జెప్పబడినది?

ఉ॥ వరాహపురాణమున.

ప్ర॥ మాహాత్మ్యముయొక్క వుద్దేశ్యమేమి?

ఉ॥ నీ వడుగుట జేసి యనేకుల సంశయమునకు సమాధానము చెప్ప బడుచున్నది. ఈ విషయమున పెక్కుజనులకు సందేహముండకపోలేదు. గీతాధ్యయనము జేసినమీదట మాహాత్మ్యమును జదవటమేలా? యందురు. వారి యశ్రద్ధయు, బలహీనతయు, మూర్ఖతయు తెలియనితనమని దోచును. పందెము వేసినవాడు యే కొంచెముతో గెలువలేకపోయినను యోడి పోయినట్లే. పరీక్షయందు నేయర్ధమార్కు తక్కువ వచ్చినను ప్యాసు గానట్లేకదా! దస్కతులేని యుత్తరమునకుగాని, మఱి దేనికైన చేవ్రాలు లేనిచో నది యెట్లు జెల్లదో, దేవతను లేదా ఏ దేవుని నష్టవిధముల నర్చించి మంగళహారతి నిచ్చినమీదట తీర్థప్రసాదములు లేదా పణ్యారము బుచ్చు కొననప్పుడు భగవదర్చనం జేయలేదనియేకదా! మఱియు తన కనుభవ నీయము గానట్లు తోచును. లేదా సాదము తానే తినుట, ప్రసాదము దేవుని యెంగిలియని గుర్తు. ఈ చెప్పిన దృష్టాంతముల ద్వారా గీతా పారాయణ మొనర్చి మాహాత్మ్యము చదువకపోయిన పారాయణము చేయనట్లు ఫలము లేదు.

ప్ర॥ మాహాత్మ్య మెన్ని శ్లోకములు చదువవలెను?

ఉ॥ అధ్యాయమునకు రెండు శ్లోకముల ప్రకారము జదివిన చాలును. కొన్ని సాంప్రదాయములవారు నాలుగుగాను, మఱికొందఱు మాహాత్మ్య మంతయును, మఱికొందఱు మఱియొకతీరు చదువుదురు. ఎన్ని శ్లోక ములు జదివినను అధ్యయనము చేసినమీదట ఫలముగలదు. ఉత్తమ మధ్యమ ముత్తమోత్తమములుగ తీర్థప్రసాదము లందినట్లు, నీ రోజు నీ యధ్యాయము ముగిసినది, ఈ ఫలము గలిగెనుకదా! అని సంతసించు దురు. అధ్యాయముగాని, యిక తక్కువగాని, లేక బొత్తిగ చదువనిదినము

